455. ఆ. ప్రియము నప్రియంబుఁ బెల్లగు సౌఖ్యదుః, ఖములు భూతభావి కార్యములును
నెవ్వనికి సమంబు [1]లివి సర్వధని యనఁ, బరగుఁ జువ్వె యట్టి భవ్యుఁ డనఘ[2].

456. వ. అని వివరించిన విని యుధిష్ఠిరుదెసఁ బ్రసాద[1]మధురం బైన యాలోకనంబు నిగుడ నయ్యక్షవరుండు మహాత్మా మదీయంబు లైన ప్రశ్నంబు లన్నింటికి సదుత్తరంబు లిచ్చితి నీవలనం బ్రీతుండ నైతి నీతమ్ము ల[2]యం దొక్కరుని ప్రాణంబు లిచ్చెద [3]నడుగు మనిన నతండు.

457. సీ. శ్యామాంగు నారక్తజలరుహ[1]నేత్రు సాలప్రాంశు నున్నతలలితబాహు
నకులుని [2]బ్రతికింపు నావుడు యక్షుండు భీమ ఫల్గును లతిభీమబలులు
ప్రియులు నీకెంతయుఁ బృథివీశ వీరిలో [3]నొకనిఁ గోరక యిట్లు నకులుఁ గోరి
తనుడు ధర్మాత్మజుం డనియెను మాతండ్రి యగు పాండువిభునకు మగువ లిరువు

ఆ. రందు గొంతి కొడుకు లైన మువ్వురిలోన, నేను బ్రతికినాఁడ నింక మాద్రి
తనయు లిరువురందుఁ దగ[4]నొక్కరుం డిప్డు, బ్రతుకవలదె చెపుమ పాడితెఱఁగు.

---

455. 1. లిల - వా. కొన్ని ప్రతులు; లివి - ఆ. చ. ఝ. త. వీ. శ. ష. 2. ఈ పద్యమునకు తరువాత 'ద' ప్రతిలో కొన్ని శ్లోకములు కలవు. కాని యవి యనన్వితములుగా నున్నవి. వానికి మూలమును దెలియవచ్చుట లేదు.

456. 1. మహితంబైన యవలోకంబు-ఈ. త. వీ. శ. ష. 2. లం దొక్కని ప్రాణంబు- వా. కొన్ని ప్రతులు; లయం దొక్కరును - పెక్కు ప్రతులు. 3. వేడు - వా. కొన్ని ప్రతులు; నడుగు మనిన - పెక్కు ప్రతులు.

457. 1. నేత్రు నద్రిసమాను నున్నతదీర్ఘబాహు - అ. ఎ. జ. ద; నేత్రు సుధీయుక్తు మున్నతదీర్ఘబాహు - ఇ. ఏ. 2. బ్రదికింపు - వా; బ్రతికింపు - పెక్కు ప్రతులు. 3. నొకరి - కొన్ని ప్రతులు. 4. దగ నిపు డొకరుండు-ఓ. శ. డ. ల; దగ నిప్పు డొక్కడు - వా. కొన్ని ప్రతులు; దగ నొకరుం డిప్డు - ఎ. శ. ష.

458. ఆ. ధర్మనందనుండు ధర్మాత్ముఁడ నియెప్డుఁ,దగిలి [1]జగము నన్నుఁబొగడుచుండు
నట్టి యేను ధర్మహానికి [2]నోర్వఁ జు, మ్మెంత వచ్చెనేని యింత నిజము.

459. వ. అనిన నతండు నీదైన ధర్మజ్ఞతకు మెచ్చితి నీతమ్ము లందఱు లబ్ధజీవితు
[1]లయ్యెద రనిన నక్షణంబ [2]విగతక్షుత్పిపాసు లై యన్నలువురు నిద్రవోయి
[3]మేల్కనిన తెఱంగున సముత్థితు లై నం జూచి విస్మితుం డై [4]ధర్మపుత్త్రుం
డి ట్లనియె.

460. చ. నిను నొక యక్ష[1]మాత్రుఁ డని నెమ్మది నమ్మఁగ నేర నయ్యెదక్ష
జననుత నీవు నిక్కముగ శక్రుఁడవో [2]యలకాధిపుండవో
యనలుఁడవో సమీరుఁడవొ [3]యట్లునుగాక జగన్నుతుండు మ
జ్జనకుఁడు [4]నైన ధర్ముఁడవొ సత్కృపఁ జెప్పుము నాకు [5]నావుఁడున్.

461. వ. అమ్మహాత్ముండు మందస్మితాననుం డై.

462. మత్తకోకిలము.

ఏను ధర్ముఁడఁజువ్వె రాజకులేంద్ర సత్యము శౌచముల్
[1]దానముం దపముల్ శమంబును దాంతియుల్ యశముం బరి
జ్ఞానయుక్తియు నాదుమూర్తులు సమ్మదంబున నిష్ఠ ను
త్సాను నుత్తమధార్మికు న్నినుఁ జూచు వేడుక వచ్చితిన్.

---

458. 1. జనము – వా. కొన్ని ప్రతులు; జగము – పెక్కు ప్రతులు. 2. నోర్వంగ నిపుడు చాలనయ్యె యింతనిజము – ఇ. ఏ.

459. 1. లయ్యెద రనిన – అ. ఇ. ఎ. ఏ. చ; లయ్యెదమనిన-త. ద; లయ్యెదువనిన – వా. కొన్ని ప్రతులు. 2. విగతప్రాణులై పడియున్న... మేల్కని – వా; విగత క్షుత్పిపాసులై – పెక్కు ప్రతులు. 3. మేల్కనినట్లు – వా. కొన్ని ప్రతులు; మేల్కనిన తెఱంగున – పెక్కు ప్రతులు. 4. ధర్మపుత్రుం – పెక్కు ప్రతులు; ధర్మజుం – వా.

460. 1. మాత్రుడుగనే మది – వా. కొన్ని ప్రతులు; మాత్రుడని నెమ్మది – పెక్కు ప్రతులు. 2. పురసూదనుండవో – పెక్కు ప్రతులు. 3. యట్టులుగాక – వా. సం. కొన్ని ప్రతులు; యట్లును – పెక్కు ప్రతులు. 4. ధర్మదేవతవో – వా. కొన్ని ప్రతులు; నైన ధర్ముడవో – ఇ. ఎ. ఏ. 5. నేర్పడన్. అనిన – వా. కొన్ని ప్రతులు; నావుడున్ – పెక్కు ప్రతులు.

462. 1. దానధర్మ తపోశమంబులు – ద; ధర్మతపోదమంబును శాంతియున్ యశమున్ ఝ.

463. వ. నన్నాశ్రయించిన జనంబులు దుర్గతిం బొరయరు గావున [1]నభిమతంబులైన వరంబు లిచ్చెద నడుగు మనినఁ బాండవాగ్రజుండు సంభ్రమభక్తి[2]పరుండగుచు దండప్రణామంబు సేసి యద్దేవోత్తముం బ్రస్తుతించి దేవా మదీయాశ్రమ వాసుండైన భూసుర[3]వరు నరణి యొక్క హారిణంబుచేత నపహృతం బయ్యె నతనికిం గర్మలోపంబు గాకుండ నయ్యరణిం గరుణింపవే యనినఁ బ్రీత చిత్తుండగుచు ధర్మదేవుండు.

464. క. వినుమేను నీమనోగతి, యనఘా యెఱుఁగంగ వేఁడి యరణీహరణం బొనరించితి మృగ మెక్కడి, దని యమ్మహనీయవస్తు వతనికి నిచ్చెన్.

465. వ. ఇచ్చి మఱియు [1]నిట్లనియె పదుమూఁడవయేఁడు సనుదెంచె నింక మీ రజ్ఞాత వాసంబు సలుపవలయు నందు [2]మీ రెవ్వరెక్కడ నేరూపంబునం జరియింపం గోరిన నయ్యెరూపంబు లలవడియెదు నెట్లున్నను మిమ్మెవ్వరు నెఱుంగ కుండునట్లుగా వరం బిచ్చితి నింక నొం డెయ్యది వలసిన నడుగు మనిన నమ్మనుజేశ్వరుం డిట్లనియె.

466. మత్తకోకిలము.

ఆదిదేవుఁడ వైన నీవు దయామతిం బొడసూపి న
న్నాదరించుటఁ జేసి ధన్యుఁడనైతి నింతకు నెక్కుడొం
డేది [1]కలునె యైన నామది యెల్లనాఁడును గ్రోధమో
హాదులం బెడఁ బాసి ధర్మువునంద నెక్కొనఁ జేయవే.

467. వ. అనిన నద్దేవుం[1]డతనికి నవ్వరం బొసంగి [2]యంతర్హితుండయ్యెఁ గౌంతేయులు గ్రమ్మఱి నిజాశ్రమంబున కరిగి ధరణీదేవునకు నరణీప్రదానంబు సేసి

---

463. 1. నభిమతవరం బిచ్చెద వేఁడు మనిన - వా. కొన్ని ప్రతులు; నభిమతంబులైన వరంబులిచ్చెద నడుగు మనిన-కొన్ని ప్రతులు. 2. భరితుం - వా. కొన్ని ప్రతులు; పరుండగు - ఆ. ఉ. ఎ. ఏ. ఝ. ద. 3. వరు - ఈ. ఉ. త. శ. ష; ముఖ్యు - వా. కొన్ని ప్రతులు.

465. 1. నిట్లనియె - పెక్కు ప్రతులు; నిట్లను నిదె - వా. కొన్ని ప్రతులు. 2. మీరెవ్వ రెక్కడెక్కడెయ్యె రూపంబులు - పీ. శ.

466. 1. గల్గునె యైన - కొన్ని ప్రతులు; గల్గెడు నైన - వా. కొన్ని ప్రతులు.

467. 1. డావరం బొసగి-కొన్ని ప్రతులు. 2. యనంతరంబ యంతర్హితుం డయ్యె-వా.

తత్ప్రయుక్తాశీర్వాదంబులు గైకొని పరమానందంబు[3]నం బొందిరని యిట్లు పాండుతనయుల వనవాసప్రకారంబు సవిస్త[4]రమధురంబుగా నుపన్యసించి.

468. క. అనఘుఁడు కృష్ణద్వైపా, యనశిష్యుఁడు బోధనిధి సమంచిత మేధా ఘనునకుఁ [1]బారిక్షితునకు, ననవరతానందసుఖసమగ్రత యొసఁగెన్.

469. సీ. భవ్యచరిత్రుఁ డాపస్తంబసూత్రుండు శ్రీవత్సగోత్రుండు శివపదాబ్జ సంతతధ్యానసంసక్తచిత్తుఁడు [1]సూరనార్యునకును బోతమాంబికకును నందనుఁ డిలఁ [2]బాకనాటిలో నీలకంఠేశ్వరస్థానమై యొసక మెసఁగు [3]గుడ్లూరు నెలవుగ గుణగరిష్ఠత నొప్పు ధన్యుండు ధర్మైకతత్పరాత్ముఁ

తే. డెఱ్ఱనార్యుండు సకల[4]లోకైకవిదితుఁ, డయిన నన్నయభట్టమహాకవీంద్రు సరస[5]సారస్వతాంశప్రశస్తి దన్నుఁ, జెందుటయు సాధుజనహర్ష సిద్ధిఁగోరి.

470. క. ధీరవిచారుఁడు తత్కవి, తా[1]రీతియుఁ గొంత దోప దద్రచనయకా నారణ్యపర్వశేషము, పూరించెఁ గవీంద్రకర్ణపుట [2]పేయముగాన్.

471. క. వీరావతార విమలా, చార మహోదార శుభవిచార సుజనమం దార [1]నవకీర్తిమౌక్తిక, హార హరపదాబ్జమధుకరాత్మ[2]విహారా.

---

3. నంబొంది రని - పెక్కు ప్రతులు; మానందంబునుంబొందిరి - వా. 4. రంబుగా- కొన్ని ప్రతులు.

468. 1. జనమేజయునకు - ఇ. ఏ.

469. 1. పోతనార్యునకును సూరమాంబకును - ఈ. ఐ. త. 2. బ్రాకనాటిలో - ఆ. ఇ. ఏ. ద. 3. గుడ్లూరి - పెక్కు ప్రతులు. 4. కవీంద్రవినుతు డైన - ఓ. 5. సారస్వతాంశు - ఘ; సారస్వతాంశప్రసక్తి - ఇ. ఏ. ఔ. గ. ఘ. చ.

470. 1. రీతియ (యొ) - కొన్ని ప్రతులు; రీతి యొకింత దోప - ఓ. 2. మోదము గాన్ - ఊ; సేవ్యముగాన్ - ఒ.

471. 1. నవశుక్తి - ఘ. 2. విచారా - ఇ. ఏ.

472. తరలము.

అమితవైభవ లోభమోహ[1]మదాదిదుర్లభ మంజువి
భ్రమ [2]విలాసితకామినీజనపంచబాణ నిరంతరా
నమదశేషనృపాలమౌళి [3]పినద్ధముగ్ధమణిప్రభా
క్రమ [4]సమంచిత విస్ఫురత్పదకాంతినిర్జితపంకజా.

గద్యము. ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బైన శ్రీమహాభారతంబునం
దారణ్యపర్వంబునందు సీతాన్వేషణంబును లంకాభిగమనంబును రామరావణ
యుద్ధంబును రాఘవాభ్యుదయంబును సావిత్రీచరిత్రంబును సూర్యుండు
గర్ణునకు హితోపదేశంబు సేయుటయుఁ గర్ణు[1]జన్మంబును
నింద్రుడు విప్రరూపంబునఁ గర్ణుకవచకుండలంబులు
హరించుటయు నారణేయంబును యక్షప్రశ్నలును
ధర్ముండు ధర్మజునకు వరంబు లొసంగుటయు
నన్నది సర్వంబును సప్తమాశ్వాసము.

*శ్రీమదాంధ్రమహాభారతమునందలి యారణ్యపర్వము సమాప్తము*

---

472. 1. మదాది - ఈ. త. పీ; భయాది - వా. పెక్కు ప్రతులు. 2. వికాసి విలాసినీ- వా. కొన్ని ప్రతులు; విలాసితకామినీ - పెక్కు ప్రతులు. 3. కనద్విశుద్ధ - ఇ. ఓ. 4. సమర్పిత (?) - ఆ. ఈ. ఔ. గ. ఘ. త. ద. శ. ష; పమంచిత - ఇ. ఓ. చ; సమర్పిత - వా. కొన్ని ప్రతులు.

473. 1. జన్మకథనంబును - వా; జన్మంబును నింద్రుండు - పెక్కు ప్రతులు.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ఆరణ్యపర్వము

### గద్య పద్య ప్రథమ పాద సూచి

### ఇ

| పద్యము | పుట |
|---|---|

## ఒ



## ఓ

## న

ప